క. ఘనుఁడు ప్రభాకరుఁ డంతఁ
దినదినమును వృద్ధిఁ బొంది దీవ్యద్బలుఁ డై
కనుపట్టు వానిఁ బట్టము
చన నొప్పఁగ గట్టితాతసౌఖ్యము గాంచెన్. 216

(మాలిని)

ప్రథితగుణకలాపా భంజితేశానచాపా
ప్రథనవిజయకోపా భానుకోటిప్రతాపా
మథితదనుజదీపా మన్మథాచ్ఛస్వరూపా
మధురతరకలాపా మాన్య రామావనీపా. 217

(గద్యము)

ఇది శ్రీ సీతారామ చరణ సేవా ప్రభావ
సంపాదిత కవితా విచిత్ర కాశ్యపసగోత్ర పవిత్ర
శ్రీమ త్పుండి పెద్ది కృష్ణస్వామిప్రణీతం బయిన
బిల్హణోపాఖ్యానం బను మహాప్రబంధంబునందుఁ

దృతీయాశ్వాసము.

---

బిల్హణీయము సంపూర్ణము.

